లఘుగ్రంథాలు

# ప్రపంచ తెలుగు మహాసభలు

27-29, డిసెంబర్ 2012, తిరుపతి




# మన ఆహారం

రచన

డా|| జి.వి. పూర్ణచందు
బి.ఏ.ఎమ్.ఎస్



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
రాష్ట్ర సాంస్కృతిక శాఖ, సాంస్కృతిక మండలి



పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం

లఘు గ్రంథాలు

# మన ఆహారం

## డా॥జి.వి. పూర్ణచందు

బి.ఏ.ఎమ్.ఎస్.




**27-29 డిసెంబర్, 2012, తిరుపతి**



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**

మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు కేంద్రం

హైదరాబాద్

మన ఆహారం

**రచయిత** : **డా॥జి.వి. పూర్ణచందు**
బి.ఏ.ఎమ్.ఎస్.

**ISBN** : **81-86073-341-0**



ప్రచురణల సంఖ్య : 480

వెల : **రూ. 20/-**

ప్రతుల సంఖ్య : **5000**

ముద్రణ : **డిసెంబరు, 2012**

ప్రతులకు : **సంచాలకులు**
ప్రచురణల విభాగం,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్ - 500 004.

---

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**, విద్యానగర్, హైదరాబాద్.

యన్. కిరణ్ కుమార్ రెడ్డి



హైదరాబాదు

ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్



# నాంది

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారిని ఒక్క వేదిక పైకి తీసుకు వచ్చేందుకు, తెలుగు ప్రభలను దశదిశలా వ్యాపింపజేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం 2012 డిసెంబర్ 27 నుండి 29 వరకు ఏడుకొండలవాడి ఆవాసమైన తిరుపతి పుణ్య క్షేత్రంలో అత్యున్నత స్థాయిలో తెలుగు మహాసభలను ఏర్పాటు చేసింది. రాష్ట్రంలోనూ, దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ ఉన్న తెలుగు వారందరూ పరస్పరం భావ వినిమయం చేసుకోవడానికీ, తెలుగువారు తమ గత చరిత్రను సంస్మరించుకుంటూ, ఉత్కృష్టమైన భవిష్యత్తును నిర్మించుకోవడానికో ఈ మహా సభలు ఎంతగానో దోహదం చేస్తాయని మేము విశ్వసిస్తున్నాం.

తొలి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగి 37 సంవత్సరాలు గడిచాయి. అయితే ఇంతవరకూ ఏ రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ మహాసభలను నిర్వహించడానికి చొరవ చూపలేదు. మా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన నాటి నుంచీ ప్రజాజీవితాన్ని ఎలా మెరుగుపరచాలీ, తెలుగు వారి వైభవాన్ని ఎలా పరిరక్షించాలీ అనే దృష్టితో పనులు చేపడుతోంది. తెలుగువారి నిర్వహణ సామర్థ్యాన్ని ఇటీవల జరిగిన జీవ వైవిధ్య సదస్సులో కూడ ప్రభుత్వం నిరూపించింది. ఈ నేపథ్యంలోనే ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించడానికి సమాయత్తమైంది.

ఇటీవల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిణామాలు సంభవించాయి. వీటి నేపథ్యంలో బహుభాషా దేశమైన మన భారత దేశంలో తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన విషయాల్లో జరిగిన కృషి గురించి, జరగవలసిన కృషి గురించి మనం చర్చించవలసింది ఎంతో ఉంది. ప్రపంచీకరణ నేపథ్యంలో మన తెలుగు భాష ఉనికిని కోల్పోకుండా పరిరక్షించేందుకు, తెలుగు ఔన్నత్యాన్ని నలుదిశలా చాటేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉంది. నిత్యం ప్రజల హితం కోరి, ప్రజల అభీష్టాలను నెరవేర్చేందుకు, తెలుగు జాతి దేశ విదేశాల్లో తలెత్తుకు తిరిగేలా చేసేందుకు అవిరళ కృషి చేస్తున్న మా ప్రభుత్వం, తెలుగు తేజం కాంతులు వెదజల్లేలా ఈ మహోజ్వలమైన సభల నిర్వహణకు పూనుకొంది. ఈ సభలలో సదస్సులు, తెలుగు వారి కళా ప్రదర్శనలు, చేతివృత్తుల ప్రదర్శనలు, లలితా కళా వైభవాన్ని చాటే కార్యక్రమాలు, రాష్ట్రేతర, విదేశాంధ్రుల సమావేశాలు, మొదలైన ఎన్నో అంశాలతో పాటు పుస్తక ప్రచురణ కూడ పెద్ద ఎత్తున చేపడుతున్నాం. అందులో భాగంగానే ఈ లఘుగ్రంథాల ప్రచురణ జరుగుతుంది.

ఎంతో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న ఈ మహాసభల సందర్భంగా ప్రచురించే లఘు గ్రంథాలు పాఠకుల ఆదరణ పొందగలవని ఆశిస్తున్నాం.

కిరణ్ రెడ్డి

**(ఎన్. కిరణ్ కుమార్ రెడ్డి)**

ముఖ్యమంత్రి

**V. VASANT KUMAR**, B.Sc.,(Ag.),M.B.A.
Minister for Tourism & Culture, Archeology & Museums,
Archives & Youth Services & Sports, N.C.C.
Government of Andhra Pradesh



Room No. 501, 5th Floor,
J-Block, A.P. Secretariat,
Hyderabad-500 022.
Phone : 040-23454168, 23450541
Fax : 040-23450899



# ప్రస్తావన

తెలుగువారు తెలుగు నేలపై 37 ఏళ్ళ విరామం తర్వాత చేసుకుంటున్న పండుగ ప్రపంచ తెలుగు మహాసభలు. మన సంస్కృతిని నలుదిశలా వ్యాపింప జేస్తున్న తెలుగు వారందరూ ఒక్కచోట చేరి, తెలుగు దనాన్ని పంచు కునేందుకు, తెలుగు పరిమళాలు వెదజల్లేందుకు ఉద్దేశించిన సన్నివేశం ప్రపంచ తెలుగు మహాసభలు. తెలుగు వారి సంస్కృతి బహుముఖీనమైంది. అందులో భాష. సాహిత్యం, చరిత్ర, లలితకళలు, జానపద, గిరిజన విజ్ఞానం వంటి ఎన్నో అంశాలున్నాయి. వీటన్నిటి గురించి విశ్లేషించుకుని, వాటిని పరిరక్షించడం, పోషించడం, పరివ్యాప్తి చేయడం ప్రభుత్వం తన విద్యుక్త ధర్మంగా భావిస్తున్నది.

ఈ బృహత్తరమైన బాధ్యతని నెరవేర్చే సంకల్పంలో భాగంగానే "ప్రపంచ తెలుగు మహాసభల" నిర్వహణకు ప్రభుత్వం నడుము కట్టింది. అతి తక్కువ వ్యవధిలో అత్యంత సమున్నత స్థాయిలో తలపెట్టిన ఈ మహాసభలకు దేశ విదేశాల నుంచి తెలుగువారు స్వాగతం పలుకుతున్నారు. అత్యధిక సంఖ్యలో ఈ సభల్లో పాల్గొంటున్నారు.

తెలుగు వారందరూ ఒక్కచోట సమకూడి, తమ గురించి చర్చించుకుని, భవిష్యత్తుకు బాటలు వేసుకునే క్రమంలో మన గురించి మనం మరోసారి తెలుసుకునేందుకు, వివిధ రంగాల్లో మనం సాధించిన దాన్ని పునశ్చరణ చేసేందుకు ఈ సభల సందర్భంగా సదస్సులు, లఘుగ్రంథాల ప్రచురణ, ప్రత్యేక సంచికల ముద్రణ,

వివిధ అంశాల్లో ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరుగుతున్నది.

తెలుగువారిది ఘనమైన చరిత్ర, అత్యున్నత సంస్కృతి. అయితే కాలంతో పాటు అభివృద్ధి పథంలో నడుస్తున్న తెలుగువారు ఎప్పటి కప్పుడు తమ సంస్కృతిలోకి కొత్త నీరును ఆహ్వానించడం సహజం. ఈ "పాతకొత్తల మేలు కలయికే" ఒక జాతిని నిత్యచైతన్యంతో నింపుతుంది. ఈ విధంగా కొత్త దనాన్ని ఆహ్వానిస్తూనే, మన గతవైభవాన్ని విస్మరించకుండా కాపాడుకోవలసిన బాధ్యత మన మీద ఉంది. ఇవన్నీ ఈ ప్రపంచ తెలుగు మహాసభల్లో చర్చకు రానున్నాయి. అందరం కలిసి, తెలుగుదనాన్ని పరిరక్షించుకునే ప్రయత్నం చేయవలసిన తరుణం ఆసన్నమైంది.

వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని తెలుగువారి భాష, సాహిత్యం, సంస్కృతి, పౌరజీవనం తదితర అంశాలపై లఘుగ్రంథాలను నిష్ణాతుల చేత రచింపజేసి ప్రచురించే గురుతర బాధ్యతను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, తెలుగు అకాడమీ, రాష్ట్ర సాంస్కృతిక శాఖ నిర్వర్తిస్తున్నాయి. తెలుగు ప్రజలు కలకాలం ఉపయోగించుకునే విధంగా ఈ పుస్తక ప్రచురణ జరుగుతోంది. వీటిని పాఠకులు, తెలుగు భాషాభిమానులు, పండితులు ఆదరిస్తారని విశ్వ సిస్తున్నాను.

వ. వసంతకుమార్

**(వట్టి వసంతకుమార్)**




# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
**POTTI SREERAMULU TELUGU UNIVERSITY**

**ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**
ఉపాధ్యక్షులు

లలిత కళాక్షేత్రం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్-500 004.


# నివేదన

ఇన్నేళ్ళ తరువాత ప్రపంచ తెలుగు మహాసభలు జరగడం తెలుగు భాషా సాహిత్యాభిమానులకు, సంస్కృత ప్రియులకు, వివిధ రంగాలలో నిష్ణాతులైన మేధావులకు ఆనంద ప్రదమైన అంశం. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ఉత్తేజం తోనే 1985లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ఆవిర్భవించింది. తెలుగు విశ్వ విద్యాలయం ఈ రాష్ట్రంలోను, భారత దేశంలోను, విదేశాలలోను ఎన్నో సభలు, సమావేశాలు నిర్వహించింది. భాషా సాహిత్య సంస్కృతుల్ని దృష్టిలో ఉంచుకొని అనేక గ్రంథాలను వెలువరించింది. తెలుగు విశ్వ విద్యాలయం అప్పటి సాహిత్య అకాడమీ నిర్వహించిన పాత్రను చాలా వరకు బాధ్యతాయుతంగా నిర్వహిస్తున్నది. విస్తరణ సేవా విభాగాన్ని అకాడమీల విభాగంగా మార్చి దానికి సంబంధించిన కార్యక్రమాలను చేపడుతున్నది. నిధుల కొరత వల్ల కొన్ని కార్యక్రమాలను అనుకున్న స్థాయిలో చేయలేకపోతున్నాం.

ఈ నాలుగవ ప్రపంచ మహాసభల సందర్భంగా తెలుగు విశ్వ విద్యాలయం తన వంతు బాధ్యతను స్వీకరించింది. భారత దేశంలో పదిచోట్ల సన్నాహక సభలు ఇప్పటికే అధిక భాగం నిర్వహించింది. 1975లో మహాసభల సందర్భంగా ప్రచురించిన 30 లఘు గ్రంథాల్ని పునర్ముద్రిస్తున్నది. మరొక 50 గ్రంథాలను ప్రత్యేకమైన అంశాలమీద రాయించి ఈ మహాసభల సందర్భంగా విడుదల చేస్తున్నది. ఆయా రంగాలలో నిష్ణాతులైన వారిచేత ప్రామాణిక గ్రంథాలను రాయించాలన్నది మా విశ్వ విద్యాలయం ఆశయం. నిజంగా ఇంత స్వల్ప సమయంలో గ్రంథ రచన చేసి సహకరించిన రచయితలకు మా ధన్యవాదాలు. ఈ గ్రంథాల ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన ప్రభుత్వానికి ప్రత్యేకంగా ముఖ్యమంత్రి గౌరవనీయులు మాన్యశ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి గారికి, సాంస్కృతిక శాఖామాత్యులు, మాన్యశ్రీ వట్టి వసంతకుమార్ గారికి, సంబంధిత ప్రభుత్వాధికారులకు మా విశ్వవిద్యాలయం పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ పరంపరలో "మన ఆహారం" అనే అంశం మీద చిరుపొత్తాన్ని సకాలంలో వ్రాసి యిచ్చిన డా॥జి.వి. పూర్ణచందు గారికి ధన్యవాదాలు. గ్రంథముద్రణ కార్యక్రమంలో చేదోడు వాదోడుగా ఉన్న విశ్వవిద్యాలయ రిజిస్ట్రర్ ఆచార్య కె.ఆశీర్వాదం గారికి, ఆచార్య సి.మృణాళినిగారికి మరియు ఆచార్య డి. మునిరత్నం నాయకుడు గారికి అభినందనలు.

(ఎల్లూరి శివారెడ్డి)

# విషయ సూచిక

ఇది....

తెలుగువారి

ఆహార, ఆరోగ్య మూలాల అన్వేషణ!

> నాత్మార్థం నాపికామార్థం/అధ భూతదయాం ప్రతి:
> యో వర్తతే చికిత్సాయాం/న సర్వమితి వర్తతే! (చరక. చి.1అ. 59 శ్లో)

మన ఆహార సంస్కృతి అనేది మన ఆహార చరిత్రనీ, దాని ఆరోగ్య మూలాలను సమన్వయం చేసే ఒక ప్రత్యేక అధ్యయన అంశం.

మనిషి జీవించే సమాజం, ఆచార వ్యవహారాలు, వైజ్ఞానిక ప్రగతి, ఆర్థిక పరమైన అంశాలు, రాజకీయ కారణాలు, మతపరమైన కారణాలు, సారస్వత విశేషాలు కలగలసి ఆహార సంస్కృతిని రూపొందిస్తాయి

చరిత్ర రచనకు శాసనాలు, ఇతర పురావస్తు ఆధారాలు అనేకం దొరుకుతాయి. కానీ, ఆహార చరిత్రకు ప్రాచీన కావ్యాలు, పాటలు, చాటువులు, జానపద గేయాలు, సామెతలు, ఇతర సాహిత్య ఆధారాలే ప్రధానం కాగా, శాసనాలు, ప్రాచీన కాలంనాటి శిల్పాలు, చిత్రాలు, స్థానిక చరిత్రలలోంచి ఆహార సంస్కృతిని ఏరుకో వలసి ఉంటుంది. చరిత్ర పూర్వయుగాల నాటి ఆహార సంస్కృతికి మన వ్యావసాయిక పదాలు, వృత్తి పరమైన ఇతర పదాలు ఆధార భూతమై నిలుస్తాయి ఆహార, వస్త్ర, నివాస, విహారాది సౌకర్యాలు కలిగించటానికి తెలుగు నేల ఆనాడు అనుకూలంగా ఉండేదని భావించవచ్చు. అనాదిగా ఎన్నో జాతుల ప్రజలు ఎంచుకొని ఇక్కడకు వచ్చి స్థిరపడటమే ఇందుకు తార్కాణం.

భారతీయులందరికీ పరమ ప్రామాణికమైన వైదిక సాహిత్యం- శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాలు తెలుగు వారిపైన గణనీయమైన ముద్ర వేస్తూ నే వారి ప్రత్యేక సంస్కృతీ వైభవాన్ని చాటుతూ అనేక చారిత్రక ఆధారాలను అందించాయి. వాటిని జల్లెడ పట్టి, మన ఆహార సంస్కృతిని వెదకవలసి

ఉంటుంది. తెలుగు వారి ఆహార చరిత్ర తెలుగు జాతి ప్రాచీనతని, ప్రత్యేకతని, విశిష్టతని, సంస్కృతీ సంపన్నతని చాటి చెప్తుంది.

చాలినన్ని చారిత్రక ఆధారాలు చేతినిండా లేకపోవటం వలనా, మధ్య యుగాల నాటి మన కావ్యాలలో కనిపించే అనేక ఆహార పదార్థాల పేర్లు మారిపోయి, వాటి వివరాలు ఏమీ తెలియక పోవటం వలన తెలుగు వారి ఆహార సంస్కృతి గురించి అధ్యయనం స్వల్పంగా జరిగింది.

దమయంతీ స్వయంవర సందర్భంలో వడ్డించిన ఒక వంటకాల పట్టికని శ్రీనాథుడు శృంగార నైషధం కావ్యంలో ఇచ్చాడు. 350 సంవత్సరాల క్రితం అయ్యల రాజు నారాయణామాత్యుడనే కవి, ఆనాటి ప్రజల జీవన స్థితిగతుల గురించి ఒక విజ్ఞాన సర్వస్వం అనదగినన్ని వివరాలతో 'హంసవింశతి' కావ్యం వ్రాశాడు. అందులో విష్ణు దాసుడు వ్యాపారం పనిమీద విదేశీ ప్రయాణానికి బయలు దేరినప్పుడు వెంట తీసుకు వెళ్ళిన ఆహార పదార్థాలలో లడ్వాలు, కోడబళ్ళు, పూరీలు కూడు పరిగెలు, తెలుపరిగెలు, మొదలైన దాదాపు 70 రకాల ఆహారపదార్థాల పట్టిక ఉంది. దారిలో వండుకొనేవీ, వండినవీ అనేకం ఈ పట్టికలో ఉన్నాయి. పేరు మారిపోయిన వంటకాలు, వండటం మరిచి పోయినవి కూడా వాటిలో ఉన్నాయి. అలాగే, అనేక కావ్యాలలో ఆనాటి వంటకాల ప్రస్తావన ఉంది. వాటి గురించి సాంఘిక చరిత్ర కారులు పెద్దగా పట్టించుకోలేదు. తెలుగు వారి సాంఘిక చరిత్రలో ఆహార చరిత్ర సముచిత స్థానం పొందలేక పోయింది. తెలుగులోనే కాదు, జాతీయ స్థాయిలో కూడా శ్రీ కె.టి అచ్చయ్య లాంటి ఒకరిద్దరు తప్ప ఆహార చరిత్రకారులు మనకు అరుదు.

తెలుగు వారి ఆహార చరిత్ర అంటే, అతి ప్రాచీనమైన తెలుగు ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక చరిత్రగా భావించి అన్వేషణ జరిపితేనే ఒక సమగ్రతను సాధించ గలుగుతాం. రాతి యుగాల కాలంలో ఇక్కడ పండిన పంటలు, పురావస్తు పరంగా దొరికిన కుండ పెంకులు, పెనాలు, మూకుళ్ళూ, గిన్నెలూ, పొయ్యిలూ, శిలాజాలుగా మారిన ధాన్యపు గింజలు, ఇతర వ్యావసాయిక ఉత్పత్తు లు ఇవన్నీ ఆహార చరిత్రని పరిశీలించేందుకు ఉపయోగించే అంశాలే! వాటి ఆధారంగా మన ఆహార చరిత్రను నిర్మించేందుకు ఒక "నిర్మాణాత్మక ఊహ" అవసరం అవుతుంది.

భారతదేశంలో, ప్రత్యేకించి తెలుగు నేలమీద జన్మ నొందిన అనేక వృక్ష జాతులు ఉన్నాయి. చారిత్రక వృక్షశాస్త్రం ఆధారంగా వాటిని మనం పరిశీలించాల్సి ఉంటుంది. తెలుగు నేల మీద సంచరించిన అనేక పశు పక్ష్యాదుల అస్థికల శిలాజాలను బట్టి చేసిన కాల నిర్ధారణలు కూడా ఆహార చరిత్ర రచనకు సామగ్రిగా ఉపయోగ పడతాయి. తెలుగు నేల మీద తరాలుగా ప్రసిద్ధి పొందిన వైద్య గ్రంథాలలో పేర్కొన్న విషయాలు కూడా ఇందుకు దోహదపడేవి అనేకం ఉన్నాయి.క్లియోపాత్రా సమాధిలో దోస ఊరుగాయకు సంబంధించన ఆధారాలు దొరికినప్పుడు ఆ ఆధారాలు ఎంత చరిత్రను మనకు చెప్తు న్నాయో ఆలోచిస్తే, మన ఆహార చరిత్ర, మన చరిత్ర ఎలా అవుతుందో అవగతమౌతుంది!

ఉత్తరాదివారి కన్నా భిన్నమైన ఆహారపు అలవాట్లు దక్షిణాదిలో ఏర్పడ టానికి తెలుగు ప్రజలలో పెరుగుతూ వచ్చిన స్వతంత్ర వైద్య పరిజ్ఞానం, ఇక్కడ సాగిన వైద్య శాస్త్ర పరమైన పరిశోధనలు ముఖ్యంగా రసౌషధాల నిర్మాణం, ఇక్కడ పుట్టిన రసశాస్త్రం ప్రధాన కారణంగా చెప్పవచ్చు. రసాయన శాస్త్ర రూపంలో ఆయుర్వేద శాస్త్రానికి మలి దశ తెలుగు నేల పైనే పురుడు పోసుకొంది. ఉత్తరాదిలో పుట్టిన చరక, సుశ్రుత వాగ్భటాదుల మార్గాన్ని వీడకుండా, త్రిదోష సిద్ధాంతాల కనుగుణంగా తెలుగు వైద్యం ఆవిష్కృతమయ్యింది. అందుకు కారకులు, ప్రేరకులూ అయిన ఆనాటి తెలుగు వారి మేధా సంపత్తి, వారి ఆరోగ్య స్పృహ ఇవన్నీ ఆహార పదార్థాలను తయారు చేసుకొనే విషయంలో తప్పకుండా ప్రభావాన్ని చూపిస్తాయి శాస్త్రీయ మైన భోజన రీతులను జన సామాన్యానికి అలవాటయ్యేలా ఆనాడు శైవ, జైన బౌద్ధ ప్రచారకులు విశేష కృషి చేశారు. వీటన్నింటి ఫలితంగానే మన ఆహార సంస్కృతికి ఆరోగ్య మూలాలు ప్రధానమైన అంశాలయినాయి.

దక్షిణాదిలో తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం ఇతర ద్రావిడ ప్రజల ఆహార అలవాట్లలో సామ్యత, సామీప్యత ఉన్నప్పటికీ, పులిహొర, అట్టు, పాయసం లాంటివి భిన్నమైన రీతుల్లో కనిపిస్తాయి తెలుగు నేల పైన కూడా ఒక్కో ప్రాంతంలో ఒక్కో ప్రత్యేక మైన వంటకం ఒక్కో ప్రాధాన్యత కలిగి ఉంది. ఏకత్వంలోని ఆ భిన్నత్వాన్ని 'తెలుగుదనం'గా అభివర్ణించవచ్చు. వీటన్నింటినీ మరింత లోతుగా అధ్యయనం చేయవలసి ఉంది.

ఒకే పేరుతో ఉన్నప్పటికీ, కొన్నిప్రాంతాలలో తీపి పదార్థాలుగా, కొన్ని ప్రాతాలలో కారపు పదార్థాలుగా, రకరకాల వంటకాలు తయారు చేసుకోవటం

కూడా ఉంది. ఒక ప్రాంతంలో వాడుకలో ఉన్న వంటకాల పేర్లు ఇతర ప్రాంతాల వారికి తెలియనివీ ఉన్నాయి. ఇవన్నీ ఆహార మాండలికాలుగా ఒక ప్రత్యేకమైన అధ్యయనం చేయవలసిన అంశాలు. ఒక సమగ్ర ఆహార చరిత్ర గ్రంథాన్ని రూపొందించేందుకు తోడ్పడే అంశాలు కూడా!

ప్రాచీన కావ్యాలు, జానపద సాహిత్యాలు, సమకాలీనంగా ఇతర భాషలలో కనిపించే సాహిత్యాలు, వివిధ నిఘంటువులలో దొరికిన సమాచారం, పురావస్తు ఆధారాలు, వృక్ష చరిత్ర శాస్త్రాలు భాషా శాస్త్ర, వైద్యశాస్త్ర అంశాలతో సమన్వయ పరచి, ఆనాటి ఆహార పదార్థాలను ఇప్పటి మన వంటకాలతో పోలుస్తూ, 'నిర్మాణాత్మక ఊహ'ద్వారా మన ఆహార చరిత్రను నిర్మించే ఒక చిన్న ప్రయత్నం మాత్రమే ఈ పుస్తకం.

ఇది ఒక ప్రారంభ యత్నం మాత్రమే! సమగ్రమూ కాదు, సర్వమూ కాదు. మరింత శాస్త్రీయంగా కొనసాగవలసిన పరిశోధనలకు కావలసిన ముడి సరుకును ప్రోది చేయటానికి ఈ పుస్తకాన్ని ఉద్దేశిస్తున్నాను తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం సాగుతున్న మహోద్యమానికి ఈ పుస్తకం ఊతమిస్తుందని ఆశిస్తున్నాను

ఇది తెలుగు ప్రజల ఆహార సంస్కృతినీ, ఆరోగ్య మూలాలనూ సమన్వయం చేసే ఒక ప్రయత్నం. ఏ ఆహార పదార్థాన్నయినా తీసుకోబోయే ముందు, దాని ప్రభావం శరీరం మీద ఎలా ఉంటుందో గమనించే అలవాటు చేసుకోగలిగితే ఆహారం ప్రాణదాయకం అవుతుంది. మరింత ఉన్నతంగా జీవించటానికి కావలసిన ఆహార ఆరోగ్య ప్రణాళికని ఎవరికి వారు ఏర్పరచుకోవటానికి ఈ పుస్తకం ఒక కరదీపికగా ఉంటుందని ఆశిస్తున్నాను

పరిశోధనారంగంలో నాకు 2009 కీర్తి పురస్కారాన్నిచ్చి గౌరవం కలిగించిన తెలుగు విశ్వవిద్యాలయం వారు ఈ లఘు గ్రంథాన్ని ప్రచురించటం మరింత గౌరవాన్ని కలిగించటంగా భావిస్తూ విశ్వవిద్యాలయం పెద్దలకు నమోవాకాలు తెలుపుకుంటున్నాను.

**- జి. వి. పూర్ణచందు**

చిరునామా: డా. జి. వి. పూర్ణచందు, సుశ్రుత ఆయుర్వేద వైద్యశాల, సత్నాం టవర్స్, బకింగ్ హాం పేట పోస్టాఫీసు ఎదురుగా, గవర్నర్ పేట, విజయవాడ- 520 002, సెల్: 94401 72642, e-mail: purnachandgv@gmail.com

1వ ప్రకరణం

# మన ఆహారం :: పుట్టు పూర్వోత్తరాలు, ఆరోగ్య మూలాలు

పశ్యేమ శరదః శతమ్

జీవేమ శరదః శతమ్

బుధ్యేమ శరదః శతమ్

రోహేమ శరదః శతమ్

పూషేమ శరదః శతమ్

భవేమ శరదః శతమ్

భూయేమ శరదః శతమ్

భూయసీః శరదః శతమ్

"నూరేళ్ళూ చూచెదము గాక! నూరేళ్ళూ బ్రతికి యుండెదము గాక! నూరేళ్ళూ జ్ఞానవంతులమై ఉందుము గాక! నూరేళ్ళూ ఉన్నత స్థితిలో ఉందుము గాక! నూరేళ్ళూ స్థిరుగా, పుష్టిగా ఉందుము గాక! నూరేళ్ళూ మనకు గడచు గాక! నూరేళ్ళకు మించి మనకు ఆయుష్షు కలుగు గాక!" అని అధర్వణ వేదం ఆయుష్యామాన్ని ప్రకటించింది. ఆయుష్షును కాపాడుకోవటం మన లక్ష్యం కావాలి.

'మృత్యోర్మా అమృతం గమయ'- అంటుంది శతపథ బ్రాహ్మణం. మృత్యువు నుంచి తప్పించి మరణం లేని స్థితికి తీసుకు వెళ్లమని ప్రార్థిస్తున్నారుఋషులు.

'యదశ్నాసి యత్ పిబసి ధాన్యం కృష్యాః పయః

య దాద్యం యదనాద్యం సర్వం తే అన్నమవిషం కరోమి'

"ఏది తింటున్నావో, ఏది తాగుతున్నావో, కృషితో ఏ ధాన్యం పండిస్తున్నావో, ఏ నీరు జలాశయాల నుంచి దొరుకుతోందో, ఏది తినదగిందో, ఏది తినదగనిదో అన్ని ద్రవ్యాలనీ నీ కోసం విషరహితంగా చేస్తున్నాను' అంటుంది ఒక ఋగ్వేద మంత్రం.

"ఓషధీభ్యో అన్నం, అన్నాత్పురుషః-ఓషధులనుంచి మనకు అన్నం లభిస్తోంది. ఈ అన్నం లోంచి సమస్త సృష్టి ఏర్పడుతోంది" అని వేదవాక్కు. మన పూర్వులు ఓషధీ గుణాలను కలిగిన వాటినే ఆహార ద్రవ్యాలుగా ఎంచుకొన్నారు.

"యా ఓషధీ: పూర్వా జాతా దేవేభ్య స్త్రియుగం పురా" (ఋగ్10-97-1, అధర్వ: 8-7) ఓషధులు దేవతలకన్నా మూడు యుగాల ముందే పుట్టాయని ఋగ్వేదం, అధర్వణ వేదాలు చెబుతున్నాయి. మనుషులు నాగరక సంపన్నులయ్యే నాటికే ఓషధులూ, ఓషధీ యుక్తమైన ఆహార ద్రవ్యాలు సిద్ధంగా ఉన్నాయంటుంది ఋగ్వేదం. ప్రకృతి మనిషి కన్నా ముందే ఏర్పడిందనీ, దానిని సద్వినియోగపరచు కోవటమే గాని, మనిషి ప్రకృతిని సృష్టించలేడనీ దీనిలో అంతరార్థం. అంతేకాదు, ప్రకృతిని ధ్వంసం చేసుకొంటే తిండీ, ఓషధులూ లేకుండా పోతాయనే హెచ్చరిక కూడా ఉంది.

"ఆహారసంభవో వస్తు :రోగాస్త్వాహార సంభవా:- ఆహారం వలన శరీరం ఏర్పడుతోంది. ఈ శరీరానికి రోగాలు ఆహారం వలనే కలుగుతున్నాయి" అని చరకుడు చెప్పిన సూత్రం తెలుగు వారికి శిరోధార్యం. జీర్ణ ప్రక్రియకు సంబంధించిన శాస్త్రీయ పరిజ్ఞానం పెరిగే కొద్దీ ఆహారం అనేది ఆరోగ్యానికి సంబంధించిన అంశంగా మారుతూ వచ్చింది. శరీరం మీద ఆహార ద్రవ్యాల ప్రభావాన్ని తొలిసారిగా అధ్యయనం చేసింది ఆయుర్వేద శాస్త్రమే!

'జగత్యేవ మనౌషధం'- ఈ ప్రపంచంలో ఔషధం కానిదేదీ లేదని ఆర్యోక్తి. జీవకుడనే ఆయుర్వేద శాస్త్రకారుడు ఓషధీ గుణాలు లేని ద్రవ్యమే లేదని ప్రకటిం చాడు. ఔషధగుణాలున్న ద్రవ్యాలలో శాక, పాకాల తయారీకి అనువైనవి ఎంచుకొని వాటిని అడవి (wild) రూపాలనుంచి గృహోపయోగ (domestic) రూపానికి తెచ్చుకోవటంలో తెలుగు వారి ప్రతిభ ఎంతయినా ఉంది. మామిడి, గుమ్మడి లాంటి ఎన్నో ద్రవ్యాలు తెలుగువారు డొమెస్టికేట్ చేసినవి ఉన్నాయి. మన ఆహార చరిత్రలో ప్రత్యేకంగా తెలుగువారే సాధించిన అనేక విశేషాలు మనం అధ్యయనం చేయవలసినవి ఉన్నాయి.

ఆహార ద్రవ్యాల యొక్క రసం(taste), గుణం(physicochemical qualities), వీర్యం(energy modalities), విపాకం (metabolic transformations), ప్రభావం(specific actions) గురించిన అవగాహన పెరుగుతున్న కొద్దీ, అనేక ఆహార ద్రవ్యాల వినియోగం పెరుగుతూ వచ్చింది. శాకాలు, పాకాలు అధర్వణ వేదంలో ఎక్కువ కనిపిస్తాయి వాటి ఆరోగ్య ప్రభావ

పరిజ్ఞానం అధర్వణ వేద కాలానికి బాగా సమకూరింది. ఈ వారసత్వాన్ని దేశం అంతా అనుసరిస్తూ వచ్చింది

అధర్వణ వేదానికి ఉపవేదంగా ఆయుర్వేద శాస్త్రం వర్ధిల్లింది. రోగాలు రాకుండా స్వస్థుడిఆరోగ్యం కాపాడటం, రోగ బారినుంచి రోగిని కాపాడటం అనే లక్ష్యాలతో ఆయుర్వేద శాస్త్రం ఒక ప్రామాణిక రూపాన్ని సంతరించుకొంది. శరీర తత్త్వాన్ని బట్టి వ్యక్తి ఆహార విహారాల ప్రభావాన్ని అంచనావేసి తదనుగుణంగా ఎలాంటి శరీరతత్వం ఉన్న వారికి ఎలాంటి ఆహారం ఉండాలో స్పష్టంగా చెప్ప గలిగారు.

శరీర ప్రకృతికి సంబంధించిన పరిజ్ఞానం ఒక్కటే చాలదనీ, శరీరంలో ఏర్పడే అసాధారణ పరిస్థితుల వికృతి జ్ఞానం కూడా ఉన్నప్పుడే వ్యాధినిర్మూలన విజయవంతం అవుతుందనీ చరక సంహిత అనే ఆయుర్వేద గ్రంథానికి వ్యాఖ్య వ్రాసిన చక్రపాణి దత్తుడు గ్రహణీవ్యాధిలో చెప్పిన చికిత్సా సూత్రాన్ని ఇక్కడ తప్పకుండా గుర్తు చేసుకోవాలి. వికృతికి కారణమైన ఆహార విహారాలకు ఆయుర్వేద శాస్త్రం ఆ విధంగా ప్రాధాన్యత నిచ్చింది. ఎవరి శరీరం తీరు వారిది. దానికి తగ్గ ఆహార ఎంపిక జరగాలి. అప్పుడే శరీర ప్రకృతి వికృతి చెందకుండా ఉంటుంది.

చిన్న ప్రేవులలో ఉండే పాచకపిత్తం అనే అగ్ని ఆహారాన్ని అణువులుగా విడగొడుతుందనీ, ఇతర అగ్నులు దానిని పచింప చేస్తాయనీ జీర్ణ ప్రక్రియలో చివరి ఘట్టంగా ఆహార రసం లేదా అన్నరసం (chyle) ఏర్పడుతుందనీ, మరింత పచనమై రస, రక్తాది ఏడు ధాతువులు ఏర్పడుతున్నాయని ఆయుర్వేద శాస్త్రం చెప్తోంది. దీన్నే "ఆహారం వంట బట్టడం" అంటున్నాం.

శరీరంలో పాచకాగ్ని (జీర్ణశక్తి) తక్కువగా ఉన్నప్పుడు అన్నరసం శక్తిగా మారకుండా ఆగిపోతుంది. మధుమేహ వ్యాధి రావడానికి కారణం ఇదే! శరీరంలో అగ్నిని ఆశ్రయించుకొనే ప్రాణం ఉంటుందని చరకుడు సూత్రీకరించాడు. "బలమారోగ్య మాయుశ్చ ప్రాణశ్చాగ్నౌ ప్రతిష్టితః"-బలం (energy or resistance to disease), ఆరోగ్యం (health) , ఆయుః (longevity), ప్రాణం (life) ఇవన్నీ అగ్ని బలాన్ని అనుసరించి ఉంటాయని చరకుడు చెప్పిన సూత్రం ప్రకారమే అగ్ని బలాన్ని కాపాడే ఆహార, విహారాలను ఆయుర్వేద శాస్త్రం సూచించింది. మన ఆహార పదార్థాల తయారీ వెనుక, మన ఆహార సంస్కృతి రూపొందటం వెనుక ఈ పరిజ్ఞానం ఒక నేపథ్యంగా ఉంది.

తెలుగు వైద్య సంప్రదాయం-ఆహార విధానం

ఒక వైపున వైదిక సాంప్రదాయ రీతులలో ఆయుర్వేద శాస్త్రం అభివృద్ధి చెందుతుండగా, తెలుగు నేల మీద శైవ సిద్ధాంతాలతో కూడిన ప్రత్యేక వైద్య విధానం వెలిసింది. ఆంధ్రసాంప్రదాయం లేదా తెలుగు వైద్యంగా దీనిని వ్యవహరించారు. చరక,సుశ్రుత, వాగ్భటాదుల ఆయుర్వేద సిద్ధాంతాలకుమరింత బలాన్ని సాధించేదిగా తెలుగు వైద్యం నడిచింది. తెలుగు బౌద్ధులు జైనులూ, శైవులు కూడా దీనిని దేశ, విదేశాలలో వ్యాపింప చేశారు.

తెలుగు వైద్యంలో ముఖ్యమైనది రస సాంప్రదాయిక తంత్రం(రసశాస్త్రం). దీని ప్రవర్తకుడు శివుడేనని, పార్వతికి రస శాస్త్రాన్నీ, నాడీ విజ్ఞానాన్నీ శివుడే బోధించాడని రసశాస్త్ర గ్రంథాలు చెప్తున్నాయి క్రీస్తు పూర్వం నాటికే, రసశాస్త్రంతో పాటు నాడీ వైద్యం పైన కూడా తెలుగువారు అధికారం సంపాదించుకొన్నారు. రోగి నాడినీ, శరీర స్పర్శనూ, రోగిరూపాన్ని, హృదయ స్పందన లాంటి శబ్దాలను నేత్రాలను, మలాన్ని, మూత్రాన్ని, నాలుకను పరీక్షించే అష్టస్థాన పరీక్షా విధానాన్ని తెలుగువారే మొదటగా ప్రారంభించారు. ఇవన్నీ ఆయుర్వేదంలో ఆంధ్ర సాంప్రదాయంగా ప్రసిద్ధి పొందాయి.

"గంధకస్తవ బీజంతు మమ, బీజం తు పారదం/అనయోర్మేలనం దేవి మృత్యు దారిద్ర్య నాశనం... గంధకం నీ బీజం, పారదం నా బీజం. దేవీ! ఈ రెండింటి సమ్మేళనం మహిమగలది, మృత్యువునూ దారిద్ర్యాన్నీ నాశనం చేస్తుంది' అని శివుడు స్వయంగా పేర్కొన్నాడు. మూలికలతో తయారయిన ఔషధాలకన్నా గంధకం, పాదరసాలతో తయరయిన రసౌషధాలకు దివ్యత్వాన్ని ఆపాదించు కున్నారు.

పాదరసం, గంధకాల మిశ్రమాన్ని ఖజ్జలి అంటారు. ఈ ఖజ్జలిలో ఇతర ఖనిజాల భస్మాలను, కొన్ని మూలికలనూ కలిపి రసౌషధాలను తయారు చేస్తారు పాదరసాన్నీ, గంధకాన్నీ, అనేక పాషాణాలను అవలీలగా శుద్ధి చేసి, అమృత తుల్యమైన ఔషధాలు తయారు చేసే ఒక ప్రత్యేకమైన రసాయన శాస్త్రం రూపొందటంలో క్రీ.పూ. కాలంలోనే తెలుగు వైద్యులు ముఖ్యపాత్ర పోషించారు. ఇక్ష్వాకుల కాలంనాటి సిద్ధ నాగార్జునుడు ఈ రసశాస్త్ర ప్రవర్తకుడు. నాగార్జున సాగరం దగ్గర నదీగర్భంలో మునిగి ఉన్న ఇక్ష్వాకుల రాజధాని విజయపురి ఆయన పరిశోధనా కేంద్రం.

వివిధ యుగాలలో నిత్యనాథ సిద్ధుడు శ్రీనాథపండితుడు, బసవరాజు, వల్లభాచార్యుడు, శరభరాజు లాంటి తెలుగు వైద్యులు చరక, సుశ్రుతాదులతో సమాన శాస్త్రవేత్తలుగా, అపర ధన్వంతరీమూర్తులుగా కీర్తి నొందారు.

రసౌషధాలు వంట ప్రక్రియలో తయారౌతాయి కాబట్టి, వంటౌషధాలని పిలుస్తుంటారు. రస కర్పూరం లాంటి ఔషధాలను కుటీరపరిశ్రమగా తయారు చేసే ఆనువంశిక కుటుంబాలు ఇప్పటికీ కొండపల్లి, జగ్గంపేట తదితర ప్రాంతాలలో ఉన్నాయి.

మధ్యయుగాలలో తెలుగు వైద్యులు బసవరాజీయం, వైద్య చింతామణి, బావప్రకాశ, యోగరత్నాకరం, మాధవ నిదానం గ్రంథాలకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. వీటి గ్రంథకర్తలు తెలుగు వారు లేదా తెలుగు వారితో సాన్నిహిత్యం కలవారు కావటంతో క్రీ.శ.15వ శతాబ్దికాలం నాటి తెలుగు ప్రజల ఆహార అలవాట్లను ఈ గ్రంథాలు గొప్పగా ప్రభావితం చేశాయి. ఆరోగ్య, ఆహార సంప్రదా యాలను తెలుగువారు తమ పర్యావరణానికి అనుకూలమైన రీతిలో మార్చుకో గలిగారు. అందుకు తగిన వైద్యక పరిజ్ఞానం తెలుగు వారికి సమగ్రంగా ఏర్పడింది.

వంట ప్రక్రియ కోసం రకరకాల పరికరాలు, ఉపకరణాలు అవసరం అవు తాయి. ఆవిరిమీద వండటం పాకానికి తీసుకురావటం, పేయించటం, ఊరపేయటం, పులియ బెట్టటం లాంటి ఔషధ నిర్మాణ ప్రక్రియలలో తెలుగు మందులు తయారయ్యేవి. వాటికోసంవాడే పాత్రలు, ఇతర ఉపకరణాలను, ఆయా విధానాలనూ ఆహార పదార్థాల తయారీకి కూడా ఉపయోగించగలగటం ఆనాడు తెలుగు వారికి పెద్ద కష్టమైన విషయం కాదు.

బియ్యపు కడుగును గానీ వండిన అన్నాన్ని గానీ పులియబెట్టి తరవాణిని తెలుగు వారు ఇష్టంగా తీసుకొనేవారు. లక్ష్మీచారు పేరుతో ఒక ప్రసిద్ధి చెందిన తరవాణి వంటకం కూడా ఉండేది. ఇది ఆయుర్వేద పద్ధతిలో ఆసవాలు, అరిష్టలనే ఔషధాల తయారీకి ఉపయోగపడే ప్రక్రియ. దానిని తెచ్చి ఆహారద్రవ్యాలకు ఉపయోగించారు.

నిప్పులో కాల్చి పుటం పెట్టే ప్రక్రియలో అనేక తందూరి వంటకాలు తయారుచేసుకొన్నారు. శ్రీనాథుడి కాలం వరకూ ప్రసిద్ధంగా ఉన్న "పోలికలు", "అంగార పూవియలు" లాంటి వంటకాలు ఇందుకు ఉదాహరణ. ఆవిరి మీద ఉడికించే కుడుములు, కుమ్ములో పెట్టి ఉడికించే బజ్జీ పచ్చళ్ళు, మిరియాలు,

జీలకర్ర లాంటి ద్రవ్యాల సారాన్ని తీసే చారులు, ఊరబెట్టి, తాలింపు పెట్టిన ఊరుగాయలు వీటన్నింటినీ ఆయుర్వేదీయ పద్ధతిలో తయారు చేసుకోవటమే ఇక్కడ ముఖ్య విషయం.

తెలుగు వైద్య సంప్రదాయంలాగానే, తమిళులకూ సిద్ధ వైద్య సాంప్రదాయం ఉంది. మౌలికంగా ఈ రెండు సిద్ధాంతాలూ ఒకే మూలంలోంచి జనించినా వాటి ప్రవర్తకుల భిన్న దృష్టి కోణాల కారణంగా విభిన్నతను పొందాయి. వైద్యక పరిజ్ఞానం కలిగిన ప్రజలు ఇతరుల కన్నా సంపన్నమైన, విశిష్టమైన, బలకరమైన, రుచికరమైన ఆహార సంస్కృతిని కలిగి ఉంటారన్నది సత్యం.

షడ్రసోపేతమైన తెలుగు భోజనం

ఆహార ద్రవ్యాన్ని ఆశ్రయించుకొని రస గుణ కర్మలు ఉంటాయి. ద్రవ్యాలు అసంఖ్యాకమైనా, వాటికి మూలమైన పంచ మహాభూత పరమాణువుల నిష్పత్తు లలో ఎక్కువ తక్కువల కారణంగా ఇన్ని ద్రవ్యాలు ఏర్పడుతున్నాయి. ఈ నిర్మాణాత్మక పంచ భూతాలను ఆశ్రయించుకొని ఉన్న రుచులు మొత్తం ఆరు ఉన్నాయి. తీపి, పులుపూ, ఉప్పూ, కారం, వగరు, చేదు అనే ఈ ఆరు రుచుల్నీ మన నాలుక తెలుసుకో గలుగుతుంది. ఆరు రుచులలో రెండు గానీ, మూడు గానీ, అనేకం గానీ, వివిధ పాళ్ళలో కలిసి అనేక వందల ద్రవ్యాలు ఏర్పడుతున్నాయి. దేని రుచి దానిదిగా ఈ ద్రవ్యాలు ఉంటాయి.

ఈ ద్రవ్యాలలో కొన్ని తేలికగా అరిగేవి, కొన్ని ఒక మోస్తరుగా అరిగేవి, కొన్ని వేడినీ, కొన్ని చలవనూ చేసేవి ఇలా ఆహార ద్రవ్యాలకు ఇరవై గుణాలుంటా యని ఆయుర్వేద శాస్త్రం చెప్తోంది.

ఆహార ద్రవ్యాలు రెండు రకాల శక్తులను కలిగి ఉంటాయి. వేడి చేసే స్వభావం ఉన్న వాటిని ఉష్ణవీర్య ద్రవ్యాలనీ, చలవచేసే ద్రవ్యాలను శీతవీర్య ద్రవ్యాలనీ పిలుస్తా రు తీపి, వగరు, చేదు ఇవి శీత వీర్యం కల ద్రవ్యాలు. కారం, ఉప్పు, పులుపు ఉష్ణ వీర్య ప్రధాన ద్రవ్యాలుగా ఉంటాయి. ఉదాహరణకు చింతపండులో పులుపు ప్రధాన రసం అయినా, అందులో మిగిలిన ఐదు రసాలలో ఏవో కొన్ని సహాయ కారులుగా ఉంటాయి. వాటిని అనురసాలని పిలుస్తా రు

'ద్రవ్యమేకో రసో నాస్తి', 'తస్మాన్నైక రసం ద్రవ్యం' అనే సూత్రాల ద్వారా ఒకే రసం (రుచి) కలిగిన ద్రవ్యాలనేవి ఉండవు. అయితే, ఉప్పు ఇందుకు మినహాయింపు! ఉప్పులో ఉప్పదనం ఒక్కటే ఉంటుంది.ఐదు రసాలతో కూడుకున్న ద్రవ్యాలు కొన్ని ఉన్నాయి. వాటిలో వెల్లుల్లి కరక్కాయ, తానికాయ, ఉసిరికాయ ముఖ్యమైనవి. కరక, తాడి, ఉసిరికలను త్రిఫలాలంటారు. ఈ త్రిఫలాలు దాదాపు అన్ని ఆయుర్వేద ఔషధాలలోనూ ముఖ్య ద్రవ్యాలుగా కలుస్తాయి అవి ఐదు రసాలను కలిగి ఉండటమే అందుకు కారణం! ఉసిరికాయ తొక్కుడు పచ్చడి (నల్లపచ్చడి)ని అన్నంలో మొదటి ముద్దగా తినే అలవాటుని, వెల్లుల్లిని వేసి ఆహార పదార్థాలు తయారు చేసుకోవటాన్ని తెలుగు ప్రజలకు తెలుగు వైద్యులే అలవాటు చేశారని దీన్నిబట్టి అర్థం అవుతోంది.

ఒకే ద్రవ్యంలో ఆరు రుచులూ ఉండవు కాబట్టి, ఆరు రుచులూ కలిగిన ఆహార పదార్థాలను తయారు చేసుకోవటంలో ప్రణాళిక బద్ధంగా వ్యవహరించాలని కూడా తెలుగు వైద్యులు ప్రబోధిస్తారు గొప్పదైన భోజనం అనటానికి షడ్రసోపేతమైన భోజనం అంటారందుకే! మన ఆహార సంస్కృతి వెనుక ఈ వైద్య పరమైన నేపథ్యాన్ని మనం గమనించాలి.

ఉగాది పచ్చడి తెలుగువారికి ప్రసాదం. ఆరు రుచులు గల ఆహార పదార్థంగా పులిహూర లాంటి ఆహార పదార్థాలను తెలుగువారు ఈ కోణంలోంచే ఆలోచించి తయారు చేశారు. ఈ వైద్యపరమైన స్ఫూర్తిని ఈ తరంవారు అందుకో లేకపోవటం వలన ఇవన్నీ పాత చింతకాయ పచ్చడి అనే లోకువ భావం వ్యాపించింది. క్రమేణా విదేశీ వంటకాల వ్యామోహం పెరిగింది. ఈనాటికీ పులిహూరను మనం వండుకొంటున్నాం. కానీ, పులుపు, ఉప్పు, కారం మాత్రమే వాటిలో ప్రధానంగా ఉంటున్నాయి. తీపి, వగరూ, చేదులను వాటిలోంచి తప్పించేశాం. తగుపాళ్లలో బెల్లం, ఆవపిండి, మెంతిపిండి కూడా కలిపినప్పుడు పులిహూర ఆరు రుచుల ఆహార పదార్థం అవుతుంది.

రసరహితం అంటే ఆరు రుచులూ లేని ఆహారం. గుణ రహితం అంటే 20 గుణాలలో ఏ ఒక్క గుణమూ లేని ఆహారం. వీర్య రహితం అంటే ఉష్ణ వీర్యమూ, శీత వీర్యమూ రెండూ కానీ నిరర్థక ఆహారం. మనుషులకు ఉపయోగపడనిదని దీని భావం. మనం తీసుకొంటున్న ఆహారం ఈ మూడు కోవలకూ చెందకుండా ఉండాలి.

నాగరికత పెచ్చుమీరిన కొద్దీ, ఈ రుచుల శాస్త్రాన్ని వదిలేసి కేలరీల కొలతలో ఆహారం విలువను గుర్తించటం మొదలు పెట్టాక పీజ్జాల్లాంటి నిస్సార, నిర్వీర్య ద్రవ్యాలకు ప్రాధాన్యత పెరిగింది. ఏమాత్రం కేలరీలు లేని ఆహారమే గొప్పదనే భావన పెరిగి పోయింది. దాని వలన శరీరానికి మేలు కలగక పోగా ఆహారం అనేది రసరహితం, గుణ రహితం, వీర్యరహితం అయిపోతుంది. తరతరాల మన ఆహార సంస్కృతి చాటి చెప్పున్నదిదే

మన ఆహార సంస్కృతి

ఆహారం ప్రాణం నిలుపుకోవటానికే ఐనా, కమ్మనైన రీతిలో తినడమే ఒక జీవితావసరంగా మన ఆహార అలవాట్లు రూపొందాయి. పోషక విలువలున్న పదార్థాలను రుచికరంగా తయారుచేసుకొని తినడం తెలుగువారి ఆహార సంస్కృతిలో ముఖ్య లక్షణం. ''స్వస్థస్య స్వాస్థ్య రక్షణమ్" అనే పద్ధతిలో ఆరోగ్య వంతుడి ఆరోగ్యాన్ని కాపాడుతూ, రోగం వచ్చినవారి దోషాలను తగ్గించేవిగా మన ఆహార పదార్థాలురూపు దిద్దు కున్నాయి

నల్లేరునిరుబ్బి పెట్టిన వడియాలను 'చాదు వడియాలు' అంటారు. ఎముకల పుష్టికి తోడ్పడతాయి. బూడిద గుమ్మడితో సమానమైన బలకర ఔషధం ఇంకొకటి లేదు. బూడిదగుమ్మడి కూర, పప్పు, పులుసు, పచ్చడి, పెరుగుపచ్చడి, వడియాలు, అట్లు, రకరకాల తీపి వంటకాలు అన్నీ తయారు చేసుకోవచ్చు ఇలాంటి ఔషధ గుణాలు కలిగిన ద్రవ్యాలను ఆహారపదార్థాలుగా మలిచి సామాన్య మానవుడి కోసం అందించిన ఘనత మన ఆహార సంస్కృతికుంది.

"సమదోష స్సమాగ్నిశ్చ సమధాతు మలక్రియ:/ప్రసన్నాత్మేంద్రియ మనా: స్వస్థ ఇత్యభిధీయతే!" అని ఆచార్య సుశ్రుతుడు స్వస్థుడికిచ్చిన నిర్వచనమే తెలుగు వారి ఆహార విహారాలకు ప్రాతిపదికగా నిలిచింది. వాతం పిత్తం కఫం ఈ త్రిదోషాలు సమస్థితిలో ఉండాలి. జాఠరాగ్ని, రక్తమాంసాది ధాతువులు కూడా సమస్థితిలో ఉండి, శరీరమలాలు సమాన స్థితిలో విసర్జించబడాలి. మనసు, ఆత్మ, ఇంద్రియాలు ప్రశాంతంగా ఉన్నవ్యక్తి ఆరోగ్యవంతుడౌతాడు. ఈ సూత్రానికి అనుగుణంగానే మన ఆహార సంస్కృతిని పెద్దలు ఏర్పరచగా, వేల సంవత్సరాలుగా మనం పాటిస్తూ వస్తున్నాం.

"ఆయు: సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనా: రస్యా: స్నిగ్ధా: స్థిరా హృద్యా ఆహారా: సాత్త్విక ప్రియా:" (భగవద్గీత)

సత్త్వగుణ ప్రధాన ఆహారం:

సాత్త్విక గుణం కలిగిన ఆహారపదార్థాలు ఆయుష్షున్ని, శక్తిని, బలాన్ని, ఆరోగ్యాన్ని, సుఖాన్ని, సంతోషాన్ని, సంతృప్తిని పెంపొందింప చేస్తాయి జీవన ప్రమాణాలను పెంచుతాయి. ద్రవంగా, మృదువుగా, కొద్దిగా నెయ్యి లేక నూనె కలిసిన, అనేక పోషక విలువలతో సుసంపన్నంగా ఉన్నవీ మేలు చేస్తాయి తీపి రుచి కలిగి సౌమ్యంగా పనిచేస్తాయి హృదయానికి శక్తినిస్తాయి శరీర ధాతువు లన్నింటికీ మూలమైన రసధాతువులో ఇవి ఇమడగలుగుతాయి. రసం లోంచి రక్తం. మాంసం, కొవ్వు, ఎముకలు మొదలైన ధాతువులు వరుసగా ఏర్పడి స్థిరంగాఉంటాయి. తీసుకొన్న ఆహారాన్ని రస రక్తాది ధాతువులుగా మార్చే గుణం ఈ సాత్త్వికాహారాని కుంటుంది.

రజోగుణ ప్రధాన ఆహారం:

చేదు, పులుపు, వగరు, కారం, ఉప్పు అతిగా కలిగినవి, అమిత వేడిగా ఉన్నవి, అధిక ఉష్ణోగ్రత దగ్గర వేగినవి రజోగుణాన్ని పెంచుతాయి. శరీరాన్ని కష్టపెడతాయి. అనేక వ్యాధులకు కారణమవుతాయి.

తమోగుణ ప్రధాన ఆహారం:

ఎక్కువ కాలం నిలవున్న ఆహారం, అలాగే రంగు, రుచి, సువాసనలు కోల్పోయిన ఆహారం, చద్ది వాసన వస్తున్న ఆహారం, కుళ్ళిన పదార్థాలు, ఇతరులు తిని వదిలేసిన ఎంగిలి కూడు, దేవుడికి నైవేద్యం పెట్టడానికి పనికిరాని అమేధ్య ఆహారం ఇవన్నీ తామస గుణాన్ని పెంచేవిగా ఉంటాయి. మానసిక వత్తిడికీ, సమస్తమైన అనర్థాలకూ కారణం అవుతాయి. మాంసం, చేపలు, దుర్వాసన గల్గిన ద్రవ్యాలు, వెల్లుల్లి మషాలాలు, మద్యం, పుట్టగొడుగులు ఇవన్నీ అమేధ్యాలే!

మన విహార సంస్కృతి

విహారం అంటే జీవన విధానం. తెలుగు ప్రజలు ఆయుర్వేదీయ మార్గాన జీవిస్తారు దినచర్య, ఋతుచర్య, రాత్రి చర్యలన్నీ ఆయుర్వేద శాస్త్రంలో చెప్పిన విధంగానే పాటిస్తారు ప్రొద్దున ముఖం కడుక్కోవటం, నాలిక గీసుకోవటం, క్షవరం చేసుకోవటం, వ్యాయామం చేయుటం, నూనె రాసుకుని, నలుగు పెట్టుకొని అభ్యంగన స్నానం చేయటం ఇవన్నీ ఆయుర్వేదీయ

మార్గంలోనే చేస్తున్నాం. కేలరీలను తీసుకోవటం, ఖర్చుపెట్టటం రెండింటి గురించిన పరిజ్ఞానం మన వాళ్ళకు మొదటి నుంచీ ఉంది.

అధికంగా ఉన్న కేలరీలు కొవ్వులోకి చేరిపోతాయని చరకుడు వివరించాడు. "బహ్వాబద్ధా మేదా:" అంటే, కొవ్వుధాతువు బహు అబద్ధంగా అంటే చాలా వదులుగా ఉంటుంది (loose adipose tissue) కాబట్టి, మిగిలిన కేలరీలు అక్కడ చేరతాయని 2,000 ఏళ్లనాడే చెప్పగలిగాడు. వదులుగా ఉండే కొవ్వు శరీరంలో పొట్ట పిరుదులు మొదలైన చోట్ల ఉంటుంది. అదనపు కేలరీలు (కఫ ధాతువు) ఆ కొవ్వు కణాలలో చేరిపోతాయి. అందువలన పొట్ట పెరగటం స్థూల కాయం ఏర్పడతాయని చరకుడు సూత్రీకరించాడు. వేళకు భోజనం చేయటం, మనసును ప్రశాంతంగా ఉంచుకోవటం. మానసిక ఆందోళనలకు దూరంగా ఉండటం, మల, మూత్రాలు సక్రమంగా అయ్యేలా చూడటం, శరీరానికి తగిన వ్యాయామం కల్పించటం. లోకహితం కలిగే పనులు చేయటం ఇలా సద్వృత్తం పేరుతో ఎన్నో విహార హితవులను చెప్పింది ఆయుర్వేద శాస్త్రం.

మన భోజన విధి:

"ఘృతపూర్వం సమశ్నీయాత్కఠినం ప్రాక్ తతో మృదు/అంతేపునర్ద్రవాశీ తు బలాద్రోగేణ ముంచతి"

నెయ్యీ నూనెలు కలిగి కఠినంగా అరిగే ఆహార పదార్థాలను మొదటగానూ, మృదువైన పదార్థాలను మధ్యలోనూ, ద్రవ పదార్థాలను చివరగానూ తినటం మన ఆహార సంస్కృతి. భావప్రకాశ వైద్య గ్రంథంలో పేర్కొన్న భోజన విధి ఇది.

ఎన్ని రకాలయిన విదేశీ ఆహార పదార్థాలు కొత్తగా వచ్చినా, కూర, పప్పు, పచ్చడి, పులుసు, చారు, మజ్జిగ ఈ వరుస లోనే మనం భోజనం చేస్తున్నాం. కాశీ మొదలైన ఉత్తరాది ప్రాంతాల ప్రజలు నెయ్యీ, నూనెలు కలిగిన రొట్టెలు తిని, ఆ తరువాత అన్నంతో మృదువైన పప్పు, పచ్చడి, ద్రవాహార పదార్థాలు తింటారని కూడా ఈ వైద్య గ్రంథంలో ఒక వివరణ కనిపిస్తుంది. ఇటీవల కొన్ని హొటళ్ళవాళ్ళు భోజనానికి ముందు పూరీ లేదా పుల్కా ఇచ్చి ఆంధ్రాభోజనం అనటం మొదలు పెట్టారు ఇది అశాస్త్రీయం.

"భోజనాగ్రే సదా పథ్యం లవణార్ద్రక భక్షణం" భోజనానికి ముందు అల్లమూ ఉప్పూ కలిపి నూరిన పొడిని మొదటి ముద్దగా తినటం తెలుగు సాంప్రదాయం. పెళ్ళి విందుల్లో శుభ సూచనగా మొదటగా లడ్డూ నివడ్డించినా దాన్నిభోజనం మధ్యలో గానీ, చివరికి గానీ తినడం మన పద్ధతి. వడ్డన పూర్తి అయ్యాకే తినడం ప్రారంభించే వారు మన పూర్వులు. ఇటీవలి కాలంలో టేబుల్ భోజనాలు వచ్చాక వడ్డించింది వడ్డించినట్టు తినటం మొదలు పెట్టాం మనం. అందువలన తీపితో భోజనం ప్రారంభించే అలవాటు కొత్తగా వచ్చింది. ఇది తెలుగు సాంప్రదాయానికి విరుద్ధం. వైద్య శాస్త్రానికికూడా విరుద్ధం.

భోజనాంతే మధురసం అని సూత్రం. భోజనానికి చివరిలో తీపి తిని భోజనాన్ని ముగించమన్నారు. భోజనం అయ్యాక కఫం పెరుగుతుంది కాబట్టి, పచ్చకర్పూరం, లవంగం వగైరా వేసిన తాంబూల సేవనతో తెలుగువారి భోజన ప్రక్రియ ముగుస్తుంది.

"తతో భోజన వేలాయాం కుర్యాన్మంగల దర్శనం"- భోజనం చేసేటప్పుడు మంగళకరమైనవి చూస్తూ, అంటే మనసుకు సంతోషాన్ని కలిగించేవి చూస్తూ అన్నం తినమన్నాడు. మారిన కాలంలో టీవీ వార్తలు చూస్తూ అన్నంతింటున్నాం. అందువలన వార్తలు అజీర్తి చేసి అనేక వ్యాధులకు కారణం అవుతున్నాయి.

'సాయం ప్రాత ర్మనుష్యాణా మశనం శ్రుతిబోధితం' అనే సూక్తి ప్రకారం, ప్రాత: అనగా, మొదటి ఝామునకు మధ్యలో, అంటే, ఉదయం 11గంటలకు, ఆ తరువాత సాయంకాలం 7 గంటలకు భోజనం చేయాలని చెప్తుంది శాస్త్రం. ఉన్నత తరగతి, మధ్యతరగతి గృహస్థులుఇంట్లో 11 గంటలకే భోజనం చేసేవారు. చద్ది కట్టుకొని పొలం పనులకు వెళ్ళేవారు కూడా ప్రొద్దున్నే పని మొదలు పెట్టుకొని 11 గంటలకు చద్ది తినేవారు. చద్ది స్థానంలో ఇప్పుడు టిఫిన్లు ఒక కొత్త సాంప్రదాయాన్ని తెలుగింటికి తెచ్చిపెట్టాయి

భోజనంలో కఠినంగా అరిగే పదార్థాలను మొదటగానూ, మృదువైన పదార్థాలను మధ్యలోనూ, ద్రవ పదార్థాలను చివరగానూ తినాలని భావప్రకాశ వైద్యగ్రంథంలో పేర్కొన్నారు. కూర, పప్పు, పచ్చడి, పులుసు, చారు, మజ్జిగ ఈ వరుసలోనే మనం భోంచేస్తు న్నాం. కాశీ మొదలైన ఉత్తరాది ప్రాంతాల ప్రజలు నెయ్యి, నూనెలు కలిగిన రొట్టెలు ముందు తిని, ఆ తరువాత అన్నంతో

మృదువైన పప్పు, పచ్చడి, ద్రవరూపమైన ఆహార పదార్థాలు తింటారని కూడా ఈ వైద్య గ్రంథంలో ఒక వివరణ కనిపిస్తుంది.

ఇటీవల కొన్ని హెూటళ్ళవాళ్ళు భోజనానికి ముందు పూరీ లేదా పుల్కా ఇచ్చి ఆంధ్రా భోజనం అని పిలవటం మొదలు పెట్టారు ఇది అన్యాయం. తెలుగువాళ్ళకు పూరీ చపాతీలతో అన్నం తినే అలవాటు లేనే లేదు. పైగా ఆంధ్ర అనే పదాన్ని వాడి అనవసర చిక్కులు తెచ్చిపెట్టారు ఇది హెూటల్ వ్యాపారులు చేసిన సామాజిక పరమైన తప్పు. ఇలాంటి పోకడలను ఖండించక పోతే అదే నిజం అనుకునే ప్రమాదం ఉంది.

కొత్త దారుల్లో మన ఆహార సంస్కృతి

ఏ దుర్ముహూర్తాన మిరపకాయలు భారత దేశంలోకి ప్రవేశించాయో అప్పటి నుంచీ తెలుగు వారి ఆహార సంస్కృతి సమూలంగా మారిపోయింది. అప్పటి వరకూ కారం కోసం మన పూర్వీకులు మిరియాలు, పిప్పళ్ళు, శొంఠి, అల్లం, జీలకర్ర, వాము, దాల్చిన చెక్కలాంటి ద్రవ్యాలనే వాడుకుంటూ ఉండేవాళ్లు. మిరప కాయలు మనకు పరిచయం అయ్యేంత వరకూ మనకు తెలిసిన కారపు ద్రవ్యాలు ఇవే!

విజయనగర సామ్రాజ్య కాలంలోనే పోర్చుగీసులు భారత దేశంలో అడుగు పెట్టారు వస్తూ, పొగాకు, మిరపకాయల్లాంటి ద్రవ్యాలను మూట గట్టి తీసుకొచ్చారు. అలా మిరపకాయల్ని భారతదేశానికి తీసుకువచ్చి రాగానే తక్కిన దేశం సంగతి అలా ఉంచితే, తెలుగు వారు మాత్రం ఆబగా వాటిని అందుకొని ప్రపంచంలో రెండవ స్థానంలో వుండే విధంగా పండించటం మొదలు పెట్టారు పోర్చుగీసులకు ఈ మిరపకాయలెక్కడివి?

భారత దేశంలో కారపు ద్రవ్యాలు ముఖ్యంగా మిరియాలు దొరుకుతాయని వాటి కోసం స్పెయిన్ నుంచి బయలుదేరిన కొలంబస్, పొరబాటున అమెరికా చేరాడు. మెక్సికో తీరంలో అతనికి ఎర్రని మిరపకాయలు కన్పించాయి. కొరికి చూశాడు. కారం నషాలానికి అంటింది. ఎక్కడ కారం దొరుకుతుందో అదే ఇండియా అనుకొన్నాడు. కాబట్టి, ఆ అమెరికానే ఇండియాగా భావించాడు. ఇండియాకి దారి కనుక్కొన్నానని సంబర పడిపోయాడు. కారం అంటే, అతనికి తెలిసింది మిరియాలే! మిరియాలు నల్లగా వుంటాయి. కానీ, ఈ కారం ఎర్రగా వుంది. అందుకని దీన్ని "రెడ్ పెప్పర్" అన్నాడు. భారతీయులు నల్లనివాళ్ళని అంటారు కదా-మరి, ఇక్కడి

ప్రజలు ఎర్రగా ఉన్నారేమిటీ? బహుశా, వీళ్ళు రెడ్ ఇండియన్లయి ఉంటారనుకొన్నాడు. అలా కొలంబస్ అమెరికాని కనుగొని రెడ్డిండియన్ల గురించి, మిరపకాయల గురించీ, ఇంకా అప్పటి ప్రపంచానికి తెలియని ఎన్నో అమెరికా విశేషాలు స్పెయినుకు తెలియ చేశాడు. యూరోపియన్ ప్రపంచానికి స్పెయిను వాళ్లు కొలంబస్ తెచ్చిన మిరపకాయల్ని పరిచయం చేయగా, పోర్చుగీసులు మనకు అందించారు. అంటించా రంటే ఇంకా బావుంటుంది. మిరపకాయల్ని మిరియంపు కాయ అన్నారు. ఇదే మిరపకాయగా వ్యవహారంలోకి వచ్చింది. మరీచి మిర్చిగా మారి ఉండవచ్చు. అమెరికా లోని 'చిలీ' మిరపకాయలకు ప్రసిద్ధి. ఈ 'చిలీ'ని బట్టి చిల్లీ పదం పుట్టింది.

1480-1564 నాటి పురందరదాసు ఒక కీర్తనలో పైకి ఆకుపచ్చగా, అమాయకంగా కన్పించే పచ్చిమిరప కాయ కొరికితే ఎంత ఘాటుగా ఉంటుందో, పాండురంగడి శక్తి కూడా అంతటిదేననీ, దానిని అంచనా వేయడం కష్టం అనీ అంటాడు. పురందర దాసు కాలానికే మిరపకాయలు విజయనగర రాజ్యంలోకి ప్రవేశించాయన్నమాట! 1650లో వెలువడిన భోజన కుతూహల అనే మరాఠీ గ్రంథంలో రఘునాథ పండితుడు 'మిరసనా' అనే కారపు కాయల గురించి పేర్కొన్నాడు. అప్పటికే మిరపకాయ రాజ్యం దక్షిణాదిలో ప్రారంభమైందన్నమాట!

యూరోపియన్లు భారత దేశంలోకి పొగాకు సహా చాలా విదేశీ ద్రవ్యాలను తెచ్చి పరిచయం చేశారు. కొన్నింటిని ఇక్కడే పండించి ఆ ఉత్పత్తులను ఎగుమతులు చేసుకొనేవారు. క్యాలీప్లవర్, క్యాబేజీ, క్యారెట్, ఆలూ, జామ ఇవన్నీ యూరోపియన్ల వలనే మనకు సంక్రమించాయి. పోర్చుగీసులు పొగాకు, జామ, బొప్పాయి లను కూడా తెలుగువారికి పరిచయం చేశారు. అలాగే, డచ్‌వాళ్ళు (వళందులు) తమ రాజధాని బటావియా నుంచి తెచ్చి పాలకొల్లు లో తోటలు వేయించి పండించిన కాయల్ని 'బత్తాయి అంటున్నాం. అంతకుమునుపు నారింజ (నారంగి) మాత్రమే మనకి తెలుసు. ఈ నారంగిలో 'నా' లోపించి 'ఆరెంజ్' అనే పేరుతో కమలాలను ఇంగ్లీషులో పిలవసాగారు. కాఫీని కూడా ఇలానే డచ్‌వారు తెచ్చి పరిచయం చేశారు. ఈ వ్యవసాయం వాణిజ్యాల వలన తెలుగు వారి ప్రాధాన్యత పెరిగింది. మిరప, బొప్పాయి, బత్తాయి పొగ+ఆకు లాంటి కొత్త పదాలు తెలుగు భాషలో ఏర్పడ్డాయి కొత్త అలవాట్లు తెలుగు ప్రజలకు అలవడ్డాయి ఈ పంటలకు ఆంధ్ర ప్రదేశ్ ప్రసిద్ధి కావడానికి ఇక్కడే ఈ యూరోపియన్లు ప్రధాన స్థావరాలు

ఏర్పాటు చేసుకొని, మన కూలీలతో, మన భూముల్లో మనతో పండింపచేయటం, మన నేల కేంద్రంగా వ్యాపారం చేసుకోవడం ప్రధాన కారణాలు

శ్రీనాథుడి వర్ణనల్లో గానీ, రాయల వారి వర్ణనల్లో గానీ ఇంకా ఇతర మహాకావ్యాల్లో గానీ కనిపించే భోజన వర్ణనల్లో చింతపండు వాడకం గురించి పెద్దగా కనిపించదు. కారపు రుచికి ఉపయోగపడే మిరియాలు ఆరోజుల్లో ఖరీదయినవి కావటం వలన తక్కువ కారం వేసుకొనే రీతిలోనే మన వంటకాలు ఉండేవి. మిరపకాయలు మనకు పరిచయం అయ్యేవరకూ, అంటే, 500 ఏళ్ళ క్రితం వరకూ చింతపండును వాడినా వంటగది మీద ఇంత పెత్తనం ఉండేది కాదన్నమాట! అప్పటి దాకా అది ఎక్కువగా ఆయుర్వేద ఔషధాల తయారీకి ఉపయోగపడే ద్రవ్యంగా ఉండేది. మిరపకాయల్ని తెలుగు వారు పండించటం మొదలు పెట్టాక కారం అనేది కారు చవక అయ్యింది. కారపు రుచిని సంపూర్తిగా ఆస్వాదించటానికి మరింత పులుపుని తెచ్చి కలిపి ఎక్కువ కారం పోసుకొని వండుకొనే పద్ధతులు మొదల య్యాయి. ఆ విధంగా మమ "కారాన్ని" ప్రదర్శించటం మొదలు పెట్టారు మన వాళ్ళు. మిరపకాయల రాక తరువాత మన వంటకాలలొ ఎంతో మార్పు రావటానికి ఇది ఒక కారణం.

తెలుగు నేల మీదకు మిరపకాయలు చేరిన కాలంలోనే ఇతర యూరోపి యన్ దేశాలకు కూడా అవి సమానంగానే చేరాయి. కానీ యూరోపియన్లు మిరియాల వైపే మొగ్గు చూపించారు. మనం మిరియాలను దాదాపుగా వదిలేసు కున్నాం. ఒకనాటి మిరియాల ఉత్పాదకులైన భారతీయులే వాటిని నిర్లక్ష్యం చేసుకోవటం, అనారోగ్య దాయక మైన మిరపకారానికి ఇలా బానిసలై పోవటం చరిత్రలో ఒక విషాదకరమైన అంశం.

అందుకనే తెలుగు వారి ఆహార చరిత్రను మిరపకాయలకు ముందు యుగం అనీ, మిరపకాయలకు తరువాతి యుగం అనీ రెండుగా విభజించుకోవటం అవసరం.ఈ గ్రంథంలో మిరపకాయలకు ముందునాటి చారిత్రక విశేషాలను వివరించే ప్రయత్నం చేస్తు న్నాను ఎందుకంటే ఆ తరువాత అంతా క్షీణ యుగమే!

మన ఆహారం- టిఫిన్లు

మనది ముప్పొద్దు ల భోజన సంస్కృతి. ఇప్పుడు మనం తింటున్నట్టు, పొద్దు న పూట ఇడ్లీ గాని, అట్టు గానీ పూరీ గానీ, ఉప్మా గానీ

తిని, కప్పు కాఫీయో, లేకపోతే టీయో తాగే అలవాటు మనకి ఈ వందేళ్ల నుంచే మొదలయింది. ఆంగ్లేయ యుగం చివరి రోజుల్లో ఉదయంపూట టిఫిను తినే అలవాటు వాళ్లనుండే మనకు సంక్రమించింది.

బందరులో బిపిన్ చంద్రపాల్ గారు వచ్చాడని కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు ఆయన గౌరవార్థం విందు చేసి, ఆవడలు కాఫీ ఇస్తే, వాటిని సేవించిన బ్రాహ్మణులకు కుల వెలి శిక్ష పడినంత పని అయ్యిందని అయ్యదేవర కాళేశ్వరరావు గారు తన జీవిత చరిత్రలో వ్రాశారు. అంటే 1907 దాకా టిఫిన్లు చేయటం, కాఫీ అనే మాదక ద్రవ్యం సేవించటం మనకు తెలీదనీ, ఈ అలవాట్లన్నీ 1920 తరువాతనే తెలుగు ప్రజలకు అలవాటయ్యాయనీ అర్థం అవుతోంది.

ఆంగ్లేయులక్కూడా టిఫిన్లు చేసే అలవాటు భారత దేశంలోకి వచ్చాకే సంక్రమించింది. మద్రాసు కేంద్రంగా మనల్ని పాలించటం మొదలైన తరువాత ఆంగ్లేయులు ఇడ్లీ, అట్టు, పూరీ, ఉప్మాలను కూడా ఇష్టపడసాగారు. వాటిని మధ్యాహ్న భోజనంగా తీసుకొనేవాళ్లు. సాధారణంగా ఆంగ్లేయులు ఈ నాటికీ ఉదయం స్వల్పాహారం, మధ్యాహ్నం అల్పాహారం, రాత్రికి ఘనమైన ఆహారం తీసుకుంటారు. మనం ఉదయం పూట స్వల్పాహారం, మధ్యాహ్నం ఘనాహారం, రాత్రికి అల్పాహారం తీసుకొంటాం. అంగ్లేయులకీ మనకీ ఆహార సంస్కృతిలో ఈ తేడా ఉంది. ఉదయం తేలికపాటి బ్రేక్ ఫస్ట్ కీ, రాత్రి ఘనాహారానికీ (సప్పర్) మధ్యలో తీసుకునే అల్పా హారాన్ని ఇంగ్లీషు పామరజనులు 'టిఫింగ్' అన్నారు. ఇడ్లీ, అట్టు, పూరీ, ఉప్మాలకు టిఫింగ్ అనే మాట వర్తించడం అలా మొదలయ్యింది. టిఫిను, టిపను, టిఫినీ ఇలా తెలుగు ప్రజల నాలుకులమీద నలిగి, 'టిఫిన్' అయ్యింది. భారతదేశంలో కొత్త అర్థాన్ని సంతరించుకున్న ఆంగ్లపదం ఇది. ప్రామాణిక ఆంగ్ల భాషలో 'లంచ్ (మధ్యాహ్న భోజనం)కి ఇది పర్యాయపదంగా ఉండేదన్నమాట! ఆంగ్లేయుల దృష్టిలో లంచ్ అంటే స్వల్ప భోజనం. ఘనంగా ఉండేది వారికి రాత్రి భోజనం. ఇలా మొదలైన ఈ టిఫింగ్ లేదా టిఫిన్ ప్రధాన ఆహారానికన్నా భిన్నమైనదాన్ని తేలికగా తీసుకోవటం అనే అర్థంలో వ్యాప్తిలోకి వచ్చి, అది భారతీయ సాంప్రదాయం అన్నంతగా చొచ్చుకొచ్చింది.

శ్రీనాథాదులు ఇడ్డెను, అట్టు, దోసియ, ఉప్పిడి లాంటి వంటకాలను బోజనంతో పాటు వడ్డించినవనే పేర్కొన్నారు గానీ, ఉదయం పూట టిఫిన్

లాగా తినేవని వ్రాయలేదు, తక్కిన సమయంలో సరదాగా తినేందుకు, ఉక్కెరలు, సేవియలు చక్కిలాలు, చేకోడిలు చెప్పారుగానీ, ఇడ్లీ అట్టు లాంటివి అలా తింటారని చెప్పలేదు. ఆఖరికి అట్లతద్ది నాడు కూడా ఉదయాన్నే లేచి, కందిపచ్చడి, పచ్చి పులుసు, పొట్లకాయకూర లాంటివే తింటారు. మధ్యాహ్నమో, సాయంత్రమో అట్లు పోసి ముత్తైదువలకువాయనం ఇస్తారు

మన సంస్కృతి టిఫిన్ల వ్యవస్థకు అనుకూలమైనది కాదు. రోజుకూలీకి వెళ్ళే శ్రామికుడు కూడా శక్తిదాయకమైన అన్నం తినటం మానేసి, రెండిడ్లీ సాంబారుతో పనికి వెళ్ళి పోతున్నాడు. అందువలన శక్తి చాలక పని సమర్థతను కోల్పోతున్నారు. ఒకప్పుడు మహాస్తూపాలు నిర్మించాలంటే తెలుగు వారేననే జాతీయ స్థాయి ఘనకీర్తి ఉండేది. ఇవ్వాళ అలాంటిది ఉన్నదా...? ఇదీ జాతికి జరిగిన నష్టం. హెూటళ్ళలో టిఫిన్ తినటమే గొప్ప అనే అభిప్రాయమే ఒక దురదృష్టం.

బొంబాయి మహానగరంలో ఉద్యోగం ఒక చోట, నివాసం మరోచోట కావటంతో ఉదయాన్న డ్యూటీకి వెళ్ళేప్పుడే మధ్యాహ్న భోజనం క్యారియర్ కట్టుకు వెళ్లటానికి అవకాశం లేక పోవటాన అక్కడ డబ్బావాలా లేదా టిఫిన్ వాలా అనే కొరియర్ వ్యవస్థ మొదలయ్యింది. ఎవరింటి దగ్గర నుంచి వాళ్ళకి మధ్యాహ్నానికి భోజనం క్యారియర్లు తెచ్చి అందించే విధానం ఇది. మధ్యాహ్న భోజనాన్ని తెచ్చే డబ్బాని టిఫిన్ బాక్స్, టిఫిన్ క్యారియర్ అన్నారు. ఎటుతిరిగీ మహారాష్ట్రులకు భోజనం అంటే చపాతీలు, పుల్కాలే కాబట్టి, చపాతీ పూరీ లాంటి వాటిని టిఫిన్ అనడం ఒక ఆచారం అయ్యింది. అది చూసిన తెలుగువాళ్ళు వరి అన్నం కన్నా భిన్నమైన ఆహారాన్ని టిపిన్ అనడం మొదలు పెట్టారు బొంబాయిలో టిఫిన్ అంటే మధ్యాహ్న భోజనం అనీ, తెలుగులో టిపిన్ అంటే 'అల్పాహారం' అనే అర్థాలు అలా స్థిరపడ్డాయి రెంటికీ ఉన్న తేడా ఇది! క్రమేణా టిఫిన్ సెంటర్లు, టిఫిన్ హెూటళ్ళు తెలుగు నేల మీద విస్తృతంగా ఏర్పడటం మొదలు పెట్టాయి ప్రొద్దుట పూట ఇడ్లీ, అట్టు, పూరీ, ఉప్మా వగైరా పదార్థాలను తిని తీరాలనే రూలు ఏదో వేదోక్తం అన్నంతగా మనం టిఫిన్లకు అలవాటు పడటం మొదలు పెట్టాం.

డైటింగూ, ఆరోగ్య స్పృహల పేరుతో రాత్రిపూట అన్నం మానేసి తేలిక పాటి ఆహారం తీసుకొంటున్నామనే భ్రమలో బట్టర్ నానులూ, విపరీతమైన మషాలాలు, నూనెలూ కలిగిన కర్రీలు తినటానికి అలవాటు పడుతున్నాం.

చివరికి ఇదే తెలుగు సంస్కృతి అని ఎక్కడ అనవలసి వస్తుందోనని భయమేసేలా ఉంది పరిస్థితి

ఆహారంలో తెలుగు దనాన్ని వదులుకొంటున్నాం. ఆహారంలో ఆరోగ్యంతో పాటు స్వారస్యాన్ని, రుచినీ, మాధుర్యాన్నీ కోల్పోతున్నాం. అలనాటి ఆహారాల అందమైన తెలుగు పేర్లను మనం వదిలేశాం. ఏ హిందీ పేరో ఇంగ్లీషు పేరో పెడితే గొప్ప అనుకునే మస్తత్వాన్ని పెంచుకుంటున్నాం. అందమైన పేర్లు మార్చేసి, చంచం జంజం లాంటి పేర్లు పెట్టడం వలన గొప్పవాళ్లం అవుతామనుకోవటం పొరబాటు. బదులుగా మనం సంస్కృతిని కోల్పోతున్నాం. అనారోగ్యాన్ని కొని తెచ్చుకొంటున్నాం.

ఇప్పటి పుల్కాలు (పోలికలు), బట్టర్ నానులూ (మండెగలు), పరోటాలూ (మణుగులు) క్రీము వేసిన సాసులూ (వెన్నపడిదెం), ఉక్కెరలు(ఖాజా బర్ఫీ), ఫ్రైడ్ రైసులూ (ద్రబ్బెడ) ఇవన్నీ 500 ఏళ్ల క్రితమే కమ్మగా వండుకున్నారు మన పూర్వులు. ఇప్పటి మన తిళ్ళు అనేక వత్తిళ్ళు తెస్తు న్నా గమనించలేక పోతున్నాం. మన సంస్కృతి ఇది కాకూడదు. మన ఆహార సంస్కృతిని, ఆరోగ్య మూలాలనూ మన తరానికి అందుబాటులోకి తెచ్చి, గౌరవ భావాన్ని పెంపొందించటం ద్వారా, సాంస్కృతిక వికాసాన్ని తిరిగి సాధించే గట్టి ప్రయత్నం జరగాలి. ఈ పుస్తకం అందుకు ఏ మాత్రం దోహద పడినా జన్మ ధన్యమే!

* * *

2వ ప్రకరణం

# మన తొలినాటి వ్యవసాయం

క్రీస్తు పూర్వం 4 నుంచీ, క్రీ.శ. 4వ శతాబ్ది వరకూ తెలుగు నేల మీద నడచిన వ్యవసాయానికి పాళీ, ప్రాకృత, సంస్కృత భాషలలో వెలువడిన బౌద్ధ సాహిత్యమే ముఖ్య ఆధారం. తెలుగు నేల మీద తెలుగు బౌద్ధ సిద్ధాంత కర్తలు పాళీ భాషలో రచించిన గ్రంథాలలో తెలుగు నేల ప్రసక్తి, ప్రస్తావన ప్రశంసలు కనిపిస్తాయి అవర శైలీయ, పూర్వ శైలీయ రాజగిరిక, సిద్ధార్థక అనే నాలుగు బౌద్ధ సంప్రదాయా లను అంధక బౌద్ధ సంప్రదాయాలని పిలుస్తారు

హ్యూన్ త్సాంగ్ బెజవాడలోని ఒక బౌద్ధ స్తూపం దగ్గర అవర శైలీయ సిద్ధాంతాలను అధ్యయనం చేశాడని, ఇక్కడ కొన్నాళ్ళపాటు ఉన్నాడని చెప్తారు ఈ నాలుగు అంధక సాంప్రదాయాలతో పాటు ఆచార్య నాగార్జునుడు ప్రతిపాదించిన వైపుల్య వాదం కూడా ఇక్కడ బహుళ వ్యాప్తి లో ఉండేది.

పాళీ శబ్దానికి ఆ భాషలో ధర్మం అని అర్థం. తెలుగులో అధర్మానికి ఎవరైనా తలబడితే, "ఇది నీకు పాడి కాదు" అని వారిస్తాం. అంటే, ధర్మం కాదని చెప్పటం! పాళీ శబ్దానికి 'పాడి' వికృతి. పాళీ భాష తెలుగుప్రజలలో సామాన్యులను ఎంతగా చేరిందో దీన్ని బట్టి అర్థం అవుతుంది. ఇప్పుడు ఇంగ్లీషు చెలామణిలో ఉన్నట్టే, అప్పుడు పాళీ చెలామణి అయ్యింది.

మనం నాగలి అని తెలుగులో పిలుస్తున్నాం. దాన్ని వైదిక భాషలో లాంగల అంటారు. నాగలి అనేది ద్రావిడ మూలాలు కలిగిన పదం. అంతేగానీ, వైదిక లాంగలి పదాన్ని ద్రావిడులు నాగలి అంటున్నారని వ్యాఖ్యానించటం సరికాదని ఎఫ్. బి. జె. క్విపర్, మైకేల్ విజ్జెల్ ప్రభృతులు పేర్కొన్నారు. ఆస్కో పర్పోలా అనే భాషా చారిత్రక వేత్త ఋగ్వేదంలో కనిపించే లాంగల శబ్దం ద్రావిడ భాషలోంచి స్వీకరించిందేనని పేర్కొన్నాడు. DEDR 2907లో వివిధ ద్రావిడ భాషలలో నాగలిని ఎలా పిలుస్తారో విపులంగా ఉంది.

Ta. నాఞ్చల్: plough.

Ma. నేఞ్ఞల్, నెఞ్ఞి: plough-shaft.

Ko. నె.ల్గ్ plough.

Ka. నేగల్, నేగిల్ plough.

Koḍ. నేఙ్గి
Te. నాగలి, nāgelu, nāgēlu id.
Kol. నాఙ్గలి (Kin.) nāŋeli id.
Nk. నాఙ్గర్ id. Nk. (Ch.) nāŋgar id.
Pa. నాఙ్గిల్id. Ga. (Oll.) nāŋgal.
(S.) నాఙ్గల్ id. Go. (W.) nāṅgēl, (A. SR.) nāngyal, (G. Mu. M. Ko.) nāŋgel, (Y.) nāŋgal,
(Ma.) నాఙ్గిలి(pl. nāŋgisku) id. (Voc. 1956); (ASu.) nāynāl, (Koya Su.) nāṅēl, nāyṅēl id.
Konḍa nāŋgel id.
Pe. నాఙ్గేల్id. Manḍ. nēŋgel id.
Kui నాఙ్గేలి id. Kuwi (F.) nangelli ploughshare; (Isr.) nāŋgeli plough. / Cf.
Skt. లాఙ్గల plough
Pali నాఙ్గల - plough;
Mar. నాగర్
H. నాఙ్గల్,
Beng. నాఙ్గల్ id., etc.; Turner, CDIAL, no. 11006. DED (S, N) 2368.

ద్రావిడ భాషలన్నింటిలోనూ కనిపించే నాగల్ శబ్దాన్ని ఋగ్వేదంలోకి చేరిన ద్రావిడ పదంగానే చరిత్ర వేత్తలు భావించారు. మరొక ఇండో ఆర్యన్ భాషా కూటమిలో ఈ పదం కనిపించక పోవటం కూడా ఈ నిర్ణయానికి ఒక కారణం.

ఒకరి నుంచి మరొకరు వ్యవసాయం నేర్చుకొన్నారు. విస్తృత స్థాయిలో వ్యవసాయం చేయటానికి ఇనుప కర్రు కలిగిన నాగలి అవసరం ఎంతయినా ఉంది. అది దక్షిణాదిలో ముఖ్యంగా తెలుగు నేల మీద లభ్యం అయ్యేది. ఇక్కడ ఆ రోజుల్లో నిస్సందేహంగా లోహ పరిశ్రమలు ఉండి ఉండాలి. ఇనుమును కరిగించగల పరిజ్ఞానం ఆనాడే తెలుగు ప్రజలకున్నదని చరిత్ర వేత్తలు అంగీకరిస్తు న్నారు

రామాయణంలో విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను దండకారణ్యానికి తెచ్చి ఆయుధాలు ఇప్పించిన కథని బట్టి, ఆయుధ తయారీ కేంద్రాలు ఇక్కడ

ఉండేవనే అంశాన్ని గుర్తించాలి. ఇక్కడ తయారయ్యే వస్తు వులకుఇక్కడి పేర్లు పెట్టటమే సహజం. నాంగలి ఇక్కడి నుంచే, ఉత్తరాదికి చేరింది. ఉత్తరాదికీ దక్షిణాదికీ నడుమ నున్న తెలుగు నేలకు ఋగ్వేద కాలంలో ఎక్కువ సాన్నిహిత్యం ఉండే అవకాశం కూడా సహజమే కదా! సున్నా అరసున్నా గామారి, నా(గలి మనకు మిగిలింది. 'నామ్' అంటే ఎద్దు. "కోల" అంటే ఎద్దు మెడమీద ఉంచే కాడి. ఈ రెండు పదాలను కలిపి నామ్+కోల అనేది నాగలి పదానికి మూలం అయ్యిందనే వాదన కూడా ఉంది.

ప్రాచీన సుమేరియన్ , ఈజిప్టియన్ భాషల్లో కనిపించే కొన్ని వ్యావసాయిక పదాలు, గ్రామ నామాలు తెలుగులో కూడా కనిపిస్తు నాయి ఎల్ వి రామస్వామి అయ్యర్ 1932 మిథిక్ సొసైటీ జర్నల్ లో శ్రీ ఎ. ఎస్ త్యాగరాజు 'ది ద్రవిడియన్ ఎఫినిటీస్' అనే వ్యాసంలో కొన్ని పదాలను ఉదహరించాడు

1. Ar(plough): అరక A plough with bullocks complete సర్వావయవములుగల నాగలికి ఎడ్లను పూనినది

అరకట్టరక= a plough with a pair of bullocks. అరకలు కట్టటం, పనికి సిద్ధం చేయటం

విడిచికట్టరక a plough with a change of bullocks. అరకలు విప్పటం, పని ముగిసిన తరువాత ఎడ్లకు విశ్రాంతి నివ్వటం

అరకాడు = (అరక+కాడు) వ్యవసాయ దారుడు, రైతు.

అరక సాగటం లేదు= వాతావరణం అనుకూలంగా లేదనీ, ఎడ్లు సహకరించక లేదనీ చెప్పకోవటం.

ఈ Ar అనే సుమెరియన్ పదం ఏరు అనే తెలుగు పదానికి కారణం అయ్యింది. ఏరు అంటే దున్నేందుకు సిద్ధంగా నాగలి. అది ముందుకు సాగటాన్నే పొలం దున్నటం అంటారు. ఏరువాక అనే పదానికి ఇదే మూలం.సుమేరియాలో చిన్నర్ (చిన్న+అర్), బాంబుర్(పాంబు+ఊరు=పాంబూర్, పాంబర్రు, పామర్రు) లాంటి ఊళ్ల పేర్లు కనిపిస్తాయి

చీమకుర్తి శేషగిరిరావు గారు 'పాళీ భాషలో తెలుగు పదాలు' పేరుతో ఒక చిన్న గ్రంథాన్ని ప్రచురించారు. అమూల్యమైన సమాచారం ఉన్న గ్రంథం ఇది. ఈ గ్రంథం ఆధారంగా కొన్ని వ్యావసాయిక పదాలు తెలుగు - పాళీ భాషలలో సమానార్థాలతో ఉన్నవాటిని ఇక్కడ పొందు పరుస్తు న్నాను

